రామచంద్ర రావు, పువ్వాడ

నేత్రవైద్యనిధానము

చెన్నపురి, 1925

Record no. 206

## Bibliographic Record Target

రామచంద్ర రావు, పువ్వాడ.

నేత్రవైద్యనిధానము / పువ్వాడ రామచంద్ర రావు.- 1. కూర్పు.- చెన్నపురి : పువ్వాడ బాలకృష్ణ, 1925.

12 p. ;17 cm.

Record no. 206

Rāmacandra Rāvu, Puvvāḍa.

Nētravaidyanidhānamu / Puvvāḍa Rāmacandra rāvu.- 1. kūrpu.- Cennapuri : Puvvāḍa Bālakṛṣṇa, 1925.

12 p. ;17 cm.

Record no. 206

శ్రీరస్తు.

# నేత్ర వైద్యనిధానము

ఆంధ్రతాత్పర్యము.

ఇయ్యది

పువ్వాడ - రామచంద్ర రావుగారిచే

ఆంధ్రీకరించి

మొదటి  కూర్పు.

పువ్వాడ - బాలకృష్ణ రావుగారిచే

"హిందూరత్నాకర" ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపురి.

1925.



వెల రు 0-4-0]  [గ్రేసు [illegible]



శ్రీ రస్తు.

# నేత్ర వైద్యనిదానము.

## ఆంధ్ర తాత్పర్యము.



శ్లోకః॥ వీరభద్రంవిరూపాక్షం నారసింహమదాంతకమ్ ।
అహిభూషంశుభాకారంభజేహంవీరశేఖరమ్ ॥

తాత్పర్యము॥ విషమదృష్టి గలవాఁడు, నృసింహుని మదము నణంచినవాఁడు, సర్పములే భూషణముగ గలవాఁడు, మంగళకరమైన యాకారముగలవాడు, శూరాగ్రగణ్యుఁడు, నగు వీరభద్రుని నేను భజించెద.

### నేత్రరోగసంఖ్య.

శ్లో॥ కృష్ణేపంచనవైవసంధిషుదశత్రీణ్యేవశుక్లేతథా। జాతాష్షోడశవర్త్మజాఃఖలుచతుర్వింశాస్తథావింశతిః। సప్తాతంతుయుతాశ్చతుర్నవతిరిత్యక్ష్ణోరశేషామయాః । యోవేత్తివ్యవహర్తుమేషవిదుషామగ్రేసమర్థోభవేత్ ॥

తా॥ నేత్రములయందు జనించురోగములు (94) విధంబులుగను అందు కంటినల్లగుడ్డునందు (5), సంధులయందు (9), తెల్లగుడ్డునందు (13), నేత్రములయందంతట (16), కంటిరెప్పలయందు (24), నేత్రనాడులయందు (27), అన (94) విధంబులుగా యుండును.

## అభిష్యంద భేదము.

శ్లో॥ వాతపిత్తకఫాద్రక్తాదభిష్యందశ్చతుర్విధః। తత్రతా
నుచితైః పత్రైర్బధ్నీయాత్త్రిదినంభిషక్ ॥

తా॥ * అభిష్యందము వాత పిత్త శ్లేష్మరక్త భేదము వలన ౪ విధంబులు. (అందు వాతాభిష్యందమున నేత్రములెఱ్ఱనై నీరు గారుచు పోట్లతోఁగూడియుండు పిత్తాభిష్యందమున కన్నులెఱ్ఱనై కడుపుమంటలతోఁగూడి మెరమెరలాడుచుండు శ్లేష్మాభిష్యందమున కండ్లు పుసిగట్టి దురదతోఁగూడియుండు రక్తాభిష్యందమున కండ్లలో దుర్మాంసము బెరిగియుండు వానియందు దోలుత క్రానుగాకునుగట్టి పిదప ఉమ్మెత్తాకును తమలపాకును మూడుదినములు గట్టిన నేత్రాభిష్యందము హరించు.

## అభిష్యందరోగములు.

శ్లో॥ వాతాత్పిత్తాత్కఫాద్రక్తాదభిష్యందశ్చతుర్విధః।
ప్రాయేసజాయతేఘోరస్సర్వనేత్రామయాకరః ॥

తా॥ అభిష్యందరోగము వాత, పిత్త, కఫ, రక్త, భేదముల వలన నాలుగు విధంబులు - వానివేదనను సహించుట గడునశక్యము. ఇది అధిమంథాదిసర్వనేత్రరోగములకు నుత్పత్తిస్థానంబు.

## వాతాభిష్యందలక్షణము.

శ్లో॥ నిస్తోదనస్తంభనరోమహర్షసంఘర్షపారుష్యశిరోభి

* అభిష్యందమన నేత్రముల నీరుగారుట.



తాపాః। విశుష్కభావశ్శిశిరాశ్రుతాచవాతాభిపన్నే నయనే భవంతి ॥

తా॥ సూదులతో బొడుచునటుల పీడగలుగుట, నేత్రములు జడముగనుండుట, శరీరమున రోమాంచముగలుగుట, కంటిరెప్పలొరసికొనుట, కఠినముగనుండుట, శిరమువేడిగనుండుట, నేత్రము లెండియుండుట, నేత్రములముందు చల్లని నీరుగారుట, ఈ లక్షణములుగలది వాతాభిష్యందమని దెలియవలయు.

## పిత్తాభిష్యందలక్షణము.

శ్లో॥ దాహప్రపాకౌశిశిరాభినందో ధూమాయనంబా
ష్పసముచ్ఛ్రియశ్చ। ఉష్ణాశ్రుతాపీతకనేత్రతాచపిత్తాభిప
న్నేనయనేభవన్తి ॥

తా॥ మిక్కుటముగనుండుట, నేత్రములుచుట్టు కురుపులు జనించుట, నేత్రములయందు శీతపదార్థమును బూయుటయందిచ్ఛ గలుగుట నేత్రముల పొగవెడలుట నేత్రములయందెల్లపుడు నొకింత వేడిగ నీరు స్రవించుట నేత్రములు పచ్చగనుండుట ఈ లక్షణములు గలది పిత్తాభిష్యందమని దెలియవలయు.

## కఫజాభిష్యందలక్షణము.

శ్లో॥ ఉష్ణాభినందోగురుతాక్షిశోథః కండూపదేహావతి
శీతతాచ। స్రావోబహుళః పిచ్ఛిలయోవచాపికఫాభిపన్నేనయనే
భవంతి ॥

తా॥ కండ్ల కావిరినివ్వవలయునవెడియిచ్చు జడత్వము నేత్రములయందు వాపుదురదగలుగుట నేత్రములు బంకగ చల్లగనుండుట మిక్కుటముగ బంకగనుండునీరు గారుట ఈ లక్షణములుగలది కఫాభిష్యందమని దెలియవలయు.

### రక్తాభిష్యంద లక్షణము.

శ్లో॥ తామ్రాశ్రుతా లోహితనేత్రతాచ రాజ్యస్సమంతాదతిలోహితాశ్చ । పిత్తస్యలిఙ్గానిచయానితానిరక్తాభిపన్నేనయనేభవన్తి ॥

తా॥ కంటిలో నెఱ్ఱనినీరుగారుట నేత్రము లెఱ్ఱగనుండుట కంటిచుట్టు యెఱ్ఱగనుండు రేఖలువ్యాపించియుండుట పిత్తాభిష్యంద లక్షణయుక్తంబుగనుండుట ఈ లక్షణములుగలది రక్తాభిష్యందమని దెలియవలయు.

శ్లో॥ వృద్ధైరేతైరభిష్యందైర్నరాణామక్రియావతామ్। తావంతస్త్వధిమంథాస్స్యుర్నయనేతీవ్రవేదనాః ॥

తా॥ అభిష్యందరోగమున ఉపచారము చేయంబడకుండుటచే వృద్ధిజెంది 4 విధములైన * అధిమంథరోగముల గలుగంజేయు. దాని సంబధమువలన నేత్రములయందు తీవ్రవేదనగలుగు ఇదియు అధిమంథసామాన్యలక్షణము.

### దోషభేదమువలన కాలావధి.

శ్లో॥ హన్యాద్దృష్టిం శ్లైష్మికస్సప్తరాత్రాద్యోధీమంథో

* అధిమందమన—కండ్లు కలకబారి పోట్లుగలుగుట.



రక్తజఃపంచరాత్రాత్। షడ్రాత్రాద్వావాతికోవైనిహన్యాన్మిథ్యాచారాత్పైత్తికస్సద్యయేవ ॥

తా॥ శ్లైష్మిక అధిమంథము 7 దినములకు రక్తజ అతిమంథము 5 దిలములకు వాతిక అధిమంథము 6 దినములకు పైత్తిక అధిమంథము మిధ్యోపచారములవలన తత్కాలమున (అనగా మూడు దినములలో) కండ్లుదృష్టిని నశింపంజేయు. (కావునలంఘనప్రలేపాది క్రియార్థంబై అంజననిషేధార్థంబై వ్యాధిస్వభావమునుబట్టి కాలావధి జెప్పంబడియె.)

### నిరామ లక్షణము.

శ్లో॥ మందవేదనతాకండూస్సంరంభాశ్రుప్రశాంతతా। ప్రసన్నవర్ణతాచాక్ష్ణోస్స్యాత్పక్వందోషమాదిశేత్ ॥

తా॥ వేపన దురదతగ్గి వాపుతీసి నేత్రములునిర్మలముగనుండిన దోషము పక్వమైనదని తెలియవలయు.

### సిరాహర్ష లక్షణము.

శ్లో॥ మోహాత్సిరోత్పాత ఉపేక్షితస్తుజాయేతరోగస్తుసిరాప్రహర్షః। తామ్రాస్రమచ్ఛంస్రవతిప్రగాఢంతథానశక్నోత్యభివీక్షితుంచ ॥

తా॥ అవివేకమువలన సిరోత్పాతరోగమునకు జికిత్సనుజేయక నుపేక్షించుటచే సిరాప్రహర్షమనురోగము జనించు. దీనియందు నేత్రములయందెఱ్ఱగ స్వచ్ఛముగ నీరును గార్చుచుండుటవలన నేత్రముల

జరచి చక్కగాజూచుట కళక్యంబుగనుండు. (ఇటుల నేత్రమునం దంతట జనించు 26 విధములగు రోగలక్షణంబులు జెప్పంబడియె.

## నల్లగుడ్డుయందు జనించు రోగములు.

### సవ్రణశుక్ర లక్షణము.

శ్లో॥ నిమగ్నరూపంతుభవేద్ధికృష్ణేసూచ్యేవవిద్ధం ప్రతిభాతీయద్వై ।స్రావంస్రవేదుష్ణమతీవయచ్చతత్సవ్రణం శుక్రముదాహరంతి ॥

తా॥ (నేత్రములయొక్క నల్లగుడ్డుయందు జనించు రోగము సవ్రణశుక్ల మనంబడు) నేత్రములయొక్క నల్లగుడ్డుయందు పువ్వు జనించి లోనమునింగినట్టుగ మధ్యభాగమున సూదితో బెజ్జముజేయబడునట్టుగ నుండినదై అత్యుష్ణముగ మిక్కుటముగ నీరునుగార్చుచుండిన సవ్రణశుక్లమనంబడు (దీనితో పీడగలిగియుండు క్షణమున పీడగలుగుట సహజంబే. ఐనను నేత్రములవంటి సుకుమారస్థలంబున గలిగెడి విశేషపీడను సహించుట కళక్యంబని భోజాదికులు వచించెదరు.) ఈ వ్రణశుక్లబసాధ్యము. ఐన నవస్థాభేదమువలన నొకానొకపుడు సాధ్యంబగును.

### అవ్రణశుక్ర లక్షణము.

శ్లో॥ స్యంధాత్మకం కృష్ణగతంనచోషం శంఖేందుకుంద ప్రతిభావభాసమ్ । వైహాయసాభ్రప్రతనుప్రకాశమథావ్రణంసాధ్యతమంవదంతి ॥



తా॥ అభిష్యంధమువలన జనించి కంటియొక్క నల్లగుడ్డుయందు దోషముతో గూడి శంఖము చంద్రుడు మొల్లపువ్వు అనువానివలె తెల్లనై ఆకాశమువందుండు మేఘమువలె సూక్ష్మప్రకాశముగలదై వ్రణ రహితంబైయుండు శుక్రము సుఖసాధ్యమని వచించెదరు.

### పరిమ్లాయిక లక్షణము.

శ్లో॥ పిత్తంకుర్యాత్పరిమ్లాయిమూర్ఛితం రక్తతేజసా । పీతాదికస్తదోధ్యోతాన్నవించాపిసపశ్యతి । వికీర్యమాణాన్ఖద్యోతైర్వృక్షాంస్తేజోభిరేవచ ॥

తా॥ పిత్తము రక్తబలముతో మిశ్రమమై పరిమ్లాయియను తిమురరోగమును గలుగజేయుచున్నయది. దాని సంబంధమువలన దిక్కులు యెండ సూర్యుడు పసుపువర్ణముగ మఱియు వృక్షములు మిణుగురుపురుగులు తేజస్సు అనువానితో వ్యాప్తంబైనవిగగనుపించు.

### దృష్టిరోగ సంఖ్య.

శ్లో॥ షడ్లింగనాశాషడిమేచరోగాదృష్ట్యాశ్రయాష్షట్చషడేవచస్యుః ॥

తా॥ పూర్వోక్త 6 విధములైన లింగనాశనంబును వుత్తరోత్ర జెప్పంబడు 6 విధములైన పిత్తవిదగ్ధ దృష్ట్యాదిరోగంబులునుజేరి 12 విధములైన దృష్టిరోగంబులుగనగు.

## ⟹ కంటితెల్లగుడ్డుయందు జనించు రోగములు. ⟸

### * అర్మరోగ భేదములు.

శ్లో॥ ప్రస్తార్యర్మతను స్తీర్ణం శ్యావం రక్తనిభం సితే। సశ్వేతం మృదుశుక్లార్మ శుక్లే తద్వర్ధతే చిరాత్ । పద్మాభం మృదు రక్తార్మ యన్మాంసం చీయతే సితే । పృథు మృద్వధిమాంసార్మ బహుళం చ యకృన్నిభమ్। స్థిరం ప్రస్తారి మాంసాఢ్యం శుష్కం స్నాయ్వర్మ పంచమమ్ ॥

తా॥ అర్మరోగంబులు 5 విధంబులు. అందు కంటియొక్క తెల్లనిభాగముపై తేటగ విస్తీర్ణముగ నల్లగ యెఱ్ఱగనుండు మాంసము జనించిన ప్రస్తారికమనియు తెల్లగ మృదువుగనుండు మాంసము జనించి కాలక్రమమున వృద్ధిం జెందిన శుక్లార్మమనియు తామరవలె నెఱ్ఱగ మృదువుగనుండు మాంసము జనించిన రక్తార్మమనియు విస్తీర్ణముగ మృదువుగ యకృత్తువలె స్థూలముగ నల్లగ గనుపించిన అధిమాంసార్మమనియు కఠినంబై ప్రసరించునదియై స్రావరహితంబై యుండు మాంసము జనించిన స్నాయ్వర్మమనియు జెప్పంబడు.

### శుక్తిరోగ లక్షణము.

శ్లో॥ శ్యావాస్స్యుఃపిశితనిభాస్తు బిందవో యే శుక్త్యాభాస్సితనియతాస్సశుక్తిసంజ్ఞః ॥

తా॥ కంటియొక్క తెల్లగుడ్డుపై నల్లగ మాంసతుల్యముగ ముత్యపుచిప్ప వర్ణతుల్యముగ బిందువులు జనించిన శుక్తియనంబడు.

* అర్మమన—మర్మాంసము.



### పిష్టక లక్షణము.

శ్లో॥ శ్లేష్మమారుతకోపేన శుక్లే మాంసం సమున్నతమ్ । పిష్టవత్పిష్టకం విద్ధి మలాక్తాదర్శసన్నిభమ్ ॥

తా॥ కఫవాతములవలన నేత్రములయొక్క తెల్లనిగుడ్లుయందు పిండివలె తెల్లగనుండు మాంసము జనించిన పిష్టకమనంబడు. ఇది మలయుక్తమైన యద్దమువలె గనుపించు.

### సిరాజాల లక్షణము.

శ్లో॥ జాలాభః కఠిన శిరో మహాంత్సరక్తస్సంతానస్మృత ఇహ జాలసంజ్ఞితస్తు ॥

తా॥ కంటియొక్క తెల్లనిగుడ్డుయందు కఠినముగ గొప్పగ యెఱ్ఱగనుండు * సిరలువ్యాపించి వలతో సమానంబైయుండిన సిరాజాలమనంబడు.

### నేత్రనాడీ లక్షణము.

శ్లో॥ గత్వాసంధీనశ్రుమార్గేణ దోషాః కుర్యుస్స్రావాన్ లక్షణైస్స్వైరుపేతాన్। తం హి స్రావం నేత్రనాడీతి చైకే తస్యా లింగం కీర్తయిష్యే చతుర్ధా ॥

తా॥ వాతాదిదోషములు † అశ్రువులయొక్క మార్గమువలన సంధులయందు బ్రవేశించి తమతమ లక్షణములతో డంగూడి స్రావమును గలుగంజేసిన నేత్రనాడియని కొందరు వచించెదరు. అది 4 విధంబులు

* సిరయన—బోలునరము. † అశ్రువులన—కంటినీరు.

# చికిత్సలు.

## గరుడాంజనము.

శ్లో॥ కతక సైంధవ తుత్థ కటుత్రయం పటిక శంఖ వరాట రసాంజనమ్।కునటితామ్ర మయోహి మరోహిణీ జలధిఫేనవచా నృకరోటికా। ఉరగపారద టంకణమంజనం త్రిఫలయా మధురోచనకంయుతమ్।కరజవల్కరసేన నుపేషితం గరుడదృష్టి సమం కురుతేదృతమ్ ॥

తా॥ చిల్లగింజలు సైంధవలవణము శుద్ధిజేసిన మైలుతుత్తము త్రికటుకములు పటిక శంఖము గవ్వలు రసాంజనము రక్తమణిశిల తామ్రభస్మము యినుపభస్మము పచ్చకర్పూరము కటుక రోహిణి సముద్రపు నురుగు వస మనుజుని తలపుర్రె సీసభస్మము రసభస్మము వెలిగారము సౌవీరాంజనము కరకతాండ్ర యుసిరికెలు యష్టిమధుకము గోరోచనము వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి క్రానుగ చెక్కరసముతో బాగుగ మర్దించి కణికలుచేసి నీళ్ళతోజాది కన్నుల బెట్టిన గరుత్మంతునితో సమానమైన దృష్టిగలుగు.

## నేత్రరోగమునకు రసక్రియ.

శ్లో॥ పారదోవిధ్రుమంనాగ సీసంచరసాంజనమ్ । సైంధవంతూర్యపణంతామ్రం తుత్థంగైరికలోధ్రకమ్ । పుత్రజీవీశిలాముస్తాగిరికర్ణ్యభయాసమమ్।చించాసౌవీరకంశుద్ధం నింబపత్రద్రవైస్సితమ్। పిష్ట్వాతామ్రమతేక్షౌద్రైః వర్తికాచార్మశుక్లజిత్ ॥



తా॥ రసభస్మము పగడము సీసభస్మము కాసీసము రసాంజనము సైంధవలవణము త్రికటుకములు తామ్రభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము కావిరాయి లొద్దుగ చెక్క పుత్రజీవివిత్తులు శుద్ధిజేసిన మణిశిల తుంగముస్తెలు తెల్లగంటెనవిత్తులు కరకక్కాయ చింతగింజెలు శుద్ధిజేసిన సౌవీరాంజనము వీనిని సమభాగములుగఖల్వములో నునిచి వేపాకురసముతో మర్దించి ముద్దజేసి తామ్రపుపాత్రలోనునిచి తేనెబోసి రాగిగిన్నెతో మర్దించి కణికలుజేసి తేనెతోజాది కన్నులబెట్టిన ఆర్మము కంటిపువ్వులుహరించు.

## నేత్రాంజనము.

శ్లో॥ కణాసౌవీరకర్పూర నాగపారదతీక్ష్ణకమ్ । విషంచలోహపాత్రేతునంద్యావర్తరసైర్దినమ్ । మర్దయేల్లోహముష్ట్యాథపటికంచూర్ణితంక్షిపేత్ । మర్దితంమర్దయేద్భూయోవర్తిశ్శుక్లామ్లపిత్తజిత్ ॥

తా॥ పిప్పళ్లు సౌవీరాంజనము కర్పూరము సీసభస్మము రసభస్మము యినుపభస్మము శుద్ధిజేసిన వసనాభి వీనిని సమభాగములుగ నినుపపాత్రలోనునిచి నంద్యావర్తపురసముతో నొకదినము యినుపగుండుదో మర్దించి పటికచూర్ణము గలిపి మరల మర్దించి కణికలుజేసి యెండించి కన్నులబెట్టిన కంటిపువ్వులు ఆమ్లపిత్తము హరించు.

## తారకాద్య వటికములు.

శ్లో॥ తారంతామ్రంరసంతుత్థంఖర్పరి పీతరోహిణీ।రసాంజనంకాంస్యశంఖంహంస పాద్యాశ్రవైర్దినమ్ । వర్తింకృత్వాంజనాద్ధంతిసమస్తంనేత్రజామయామ్ ॥

తా॥ వెండిభస్మము తామ్రభస్మము రసభస్మము శుద్ధిజేసిన మైలుతుత్తము శుద్ధిజేసినకఫరి ప్రూనిపసపు కటుకరోహిణి రసాంజనము కంచుభస్మము శంఖము వీనిని సమభాగములుగ ఖల్వములో నునిచి హంసపాదియాకు రసముతో నొకదినము మర్దించి కణికలుజేసి నీళ్ళతోజాది కన్నులబెట్టిన సర్వనేత్రరోగములు హరించు.

## చంద్రోదయవర్తి.

శ్లో॥ * హరిద్రానింబపత్రాణి పిప్పలీమరిచానిచ। § విభీతకకరంజానిశంఖనాభిర్మనశ్శిలా। ¶ ఏతానిసమభాగానిహ్యాజామూత్రేణపేషయేత్ । $ నాశయేత్తిమిరంకండూంపటలాన్యర్బుదానిచ । అపిత్రివార్షికంశుక్రం మాసేనైకేననాశయేత్।అధికానిచమాంసానిరాత్ర్యంధత్వం తథైవచ।వర్తిశ్చంద్రోదయానామన్నృణాందృష్టివిశోధినీ ॥

తా॥ పసపు వేపచిగురు పిప్పళ్ళు మిరియాలు తానికాయల లోనిపలుకులు క్రానుగవిత్తులు శంఖము శుద్ధిజేసిన నాభి శుద్ధిజేసిన మణిశిల వీనిని సమభాగములుగ ఖల్వములోనునిచి మేకపంచితముతో నూరి కణికలుజేసి నీళ్ళతోజాది కన్నులబెట్టిన కండ్లుకానరాకుండుట దురద పొరలు అర్బుదము 3 సంవత్సరములుగనుండు కంటి పువ్వులు దుర్మాంసములు రేచీకటి వీని 1 మాసములో హరింపంజేయు

* హరీతకీచచాకుష్ఠం. § విభీతకస్యమజ్జాచ. ¶ సర్వమేతత్సంము [illegible] $ వారికండూంచ తిమిరమర్బుదంపటలానిచ । అతిరక్తాని మాంసాని పుష్పం వర్త్మనిహంతిచ.



# నెం. 83, నారసింహలేహ్యము.

40 తులములు రూ, 12-0-0

# నెం. 6, లోహాభ్రకసిందూరము,

1½ తులమున్నర రూ, 9-0-0

చిరకాలము క్రిందటనే మేమీ రెండౌషధ రత్నములను పెట్టి, ప్రచురించి విక్రయించుచుండగా, సుకీర్తిగాంచి యనేక గ్యతాపత్రికలు, బంగారు పతకములు నంది, సుప్రసిద్ధినొందియు సంగతి నీదేశమందన్ని భాగములవారు నెఱుంగుదురు. ఇవి నిప్పు ముగ పుటముచేసిన, భస్మములు సారవంతములగు మూలికాదులతో నిర్మలముగను సిద్ధముజేయబడి యున్నవి.

సవాయి మొదలగు సుఖవ్యాధులు కలిగిన పిమ్మట బం శేరము రహస్యస్థలముల యందలి పుండ్లు, కీళ్ళు సలుపులు, నొప్పు పట్లుతప్పుట, సలుపు, ఎఱుపు, తెలుపు, మచ్చలు, దద్దురులు, దురద కండ్లెఱుపెక్కి నీరుకారుట, పొట్లు మొదలగు కండ్లబాధలు, మ బాధించుచుండు సవామేహవ్రణములు, శుక్లమునీరయి, మూత్రము గలసిపోవుట, అతిశీఘ్ర స్ఖలనమవుట మొదలగు శుక్లనష్ట వ్యాధు మాన్పి, పలుచనైన వీర్యమును జిక్కపఱచి, రక్తమును, ఇంద్రియము వృద్ధినొందించుటయే గాక శరీరపుష్టిని, కాంతిని, శరీరమునకు న లను, బలమును గలిగించి, అజీర్ణమును దొలగించి, ఆకలిని బుట్టించు

(అడ్రసు)

అక్టోబరు నెల.
1925 సం॥

పొన్నమండ లక్ష్మణస్వామి
ప్రొప్రయిటరు,
ఆయుర్వేద వైద్యశాల,
కోరంగి. గోదావరిజిల్లా. చెం. పురి రాజ

